గొప్పవాళ్ళనుభవించే సుఖమే. దుఃఖమూ అనుభవించారు— రాజులూ, గొప్పవాళ్ళూ అనుభవించేలాటి దుఃఖమే !

వాళ్ళకు మధ్యమధ్య సంతానంకూడా కలిగింది, పిల్లలు కాలురావడంతోనే ఏదో ఒకచిప్పపట్టుకొని తల్లిదండ్రులను వదిలిపెట్టి ఏదోఒకచెట్టునో, ఒకవీధినో ఆశ్రయించేవారు. వారికి కలిగిన సంతానమంతా ఈవిధముగా అన్నిదిక్కులకూ చెదిరిపోయారు. బిచ్చగాడూ వాడిభార్యా ఈవిధంగా కాలక్షేపంచేస్తూ ఉండగా ఒకనాటి సాయంకాలం విధివశాన ఆమెకు చిన్నజబ్బు చేసింది, రాత్రల్లా మేలుకొని ఆమెజబ్బును తన ఆలోచనలతో, కోరికలతో పోగొట్టవలెనని అతడు ప్రయత్నించాడు. తెల్లవారే సరికి జబ్బు నిమ్మళించలేదు సరికదా ఆమె బిచ్చానికి బయలు దేరడానికికూడా ఓపిక లేకపోయింది. ఆమెను ఆచెట్టుకిందే పడుకోబెట్టి తనభుజంమీద గుడ్డ ఆమెకుకప్పి బిచ్చగాడు తనచిప్పా, కర్రా పుచ్చుకొని బిచ్చమెత్తుకోడానికి బయలుదేరాడు. బయలుదేరకపోతే ఎట్లా? ఆరోజుకు గంజేదీ ?

ఒంటరిగా వచ్చావేమని తోడిబిచ్చగాళ్ళు అడిగారు. చెప్పాడు, అందులో ఒకడు ఒకమాత్రయిచ్చి ఆమెకు వెయ్యమన్నాడు! బిచ్చగాళ్ళల్లోనూ వైద్యులున్నారు! కొన్నివీధులుతిరిగి కొంచెంబియ్యం బిచ్చమెత్తుకొని యింటికివచ్చి భార్యకు మాత్ర వేశాడు. బియ్యం చెట్టుకిందే ఉడికించాడు. తానింత తిన్నాడు. భార్యతినేస్థితిలోలేదు. మిగిలినగంజీకూడా అక్కడ వదలిపెట్టి భార్యదగ్గిరచేరి ఆమెకు ఉపచారం చేస్తున్నాడు. రోగంమాత్రం ముదురుతోంది. కొన్నాళ్ళు గడచినవి. ఆమెకు బ్రతికే యోగ్యతలేదని బిచ్చగాళ్ళు నిశ్చయించారు. ఒకనాటిరాత్రి ఆమె

ఆచెట్టుకిందే ప్రాణాలు వదిలిపెట్టింది. బిచ్చగాడు ఆమెపక్కనే కూచున్నాడు. అతడుపడ్డ కష్టాలూ, అతడు పొందిన దుఃఖమూ ఆమర్రిచెట్టుకుతప్ప ఇంకెవరికీ తెలియవు.

3

రెండురోజు లయింది. ఆ బిచ్చగాడు ఒక్కడూ ఆచెట్టు కింది పడిఉన్నాడు. మూడోరోజు వచ్చింది. ఆకలివేసింది. జోలి చూచుకొన్నాడు. కుక్కలు జోలి పీకివేసి బియ్యం తినివేసినవి. తోడి బిచ్చగాళ్ళు తమపొట్టకోసం తంటాలుపడుతూ అతనిసంగతే మరిచారు. చిరిగినజోలి చేత్తోపుచ్చుకొని తూలుతూ ఆబిచ్చగాడు ఇంటింటికీ బిచ్చమెత్తడానికి వెళ్ళాడు. "మొద్దులా ఉన్నావు, కూలి చేసుకోకూడదా" అన్నారు కొందరు మామూలు ప్రకారం. "చెయ్యి ఊరుకోలే" దన్నారు కొందరు. "పాడితేనేగాని బియ్యం వెయ్య" మని కొందరుపిల్లలన్నారు. మధ్యాహ్నమయింది. ఒక ముసలిముత్తయిదువ 'గంజి తాగుతావా అబ్బీ' అంది. దాక పట్టేడు. ఆమెపోసినగంజి తాగాడు. మర్రిచెట్టు కిందికి వచ్చాడు. జోలితలకింద పెట్టుకొని కళ్ళుమూసుకు పడుకొన్నాడు.

... ... ... ...

రోజూరోజూ అతడు బిచ్చానికి వెళ్లుతూనూ ఉన్నాడు, పొట్టనింపుకొంటూనూఉన్నాడు. ఏదోఒకవిధంగా, భార్య నష్టపడ్డడు తెలుచుకొంటూనూ ఉన్నాడు. యథాప్రకారం కోయిలలు కూస్తూనూ ఉన్నవి, చిలకలు పలుకుతూనూ ఉన్నవి. గుడ్లగూబలు సాయంకాలం కావడంతోనే అతన్ని—అతన్ని ఒక్కన్నే—పలకరిస్తూనూ ఉన్నవి.

# "గోదావరినవ్వింది"

౧

సాయంకాలము. పెద్ద ముత్తైదువ లాగ సూర్యుడు పసుపూకుంకుం పూసుకొని గోదావరిలో మునుగబోతున్నాడు. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నవి. పశువులు ఇళ్లకు మళ్ళుతున్నవి. నాగరీకగర్వ మెరుగని జానపదులుకూడా తమ తమ యిండ్లకు పోతున్నారు. నాగరీకులు క్లబ్బులకు వెళ్లుతున్నారు. నాగరీకుణ్ణి నేను షికారు పోతున్నాను!

గోదావరి యిద్దరి గట్టుమీాదనుంచి నడిచి వెళుతున్నాను. గోదావరిగాలి తగిలినప్పుడు తప్ప, మిగిలిన సమయాల్లో గట్టు గట్టంతా పట్నవాసపు వాసన కొడుతోంది. ఒకచోట ఒక పెద్దమనిషి కాఫీకి బదులు ఇంకో పానీయమేకో పుచ్చుకుంటే దేహానికి ఆరోగ్యకరంగా ఉంటుందని ఒక సువాసినితో ముచ్చటిస్తున్నాడు. ఒకచోట ఇద్దరు వర్తకులు ధరలతేడాలను గురించీ, లాభాలను గురించీ ప్రసంగించుకొంటున్నారు. తాను తొడుక్కొన్న జపానుపట్టు లాగూ, "పోలో కాలరు షర్టూ" తలుచుకొంటూ ఆనందం పొందుతున్నాడు ఒక బీదవిద్యార్థి.

వెళ్ళగా వెళ్ళగా క్రమక్రమంగా ఈ వాసన తగ్గడం మొదలెట్టింది. కొంతసేపటికి ఒకకొత్తవాసన వేసింది. అది పల్లెటూరి వాసన.

# దీక్షితులు కథలు

చెట్లనుంచి కమ్మనిగాలి కొట్టుతోంది — గోదావరి మీదనుంచి వచ్చినగాలి. మోటారుకార్ల బూడిద సోకని చెట్ల ఆకులు పచ్చగా, నున్నగా, అందంగా, జేగురు ఎండలో ఆడుతున్నాయి. గట్టుకు రెండువైపులా స్వేచ్ఛగా పెరిగినదుబ్బులు. ఆ దుబ్బులలో ముగ్గురు ఆడపిల్లలు సంచరిస్తున్నారు. సిగ్గు వాళ్ళ హృదయాలలో ప్రవేశించబోయే వయస్సు. కాళ్ళకు జోళ్ళు తొడుక్కొన్నారు. జపానుజోళ్లు కావు. ఈ కాలపు చదువుకొనే ఆడవాళ్ళు వేసుకొనే వన్నెల చిన్నెల నగిషీస్లిప్పర్సు కావు. వాళ్ళ గ్రామంలో, వాళ్ళ అన్నలో తమ్ములో మామలో తండ్రులో కుట్టించిన జోళ్ళు. పాదాలను కాపాడేజోళ్ళు. జోళ్ళవల్ల అందం సంపాదించుగోగోరే పాదాలు కావు వారివి. పాదాలవల్లనే జోళ్ళకు అందంవస్తోంది. ఏ సభలోనూ తీర్మానం చేసుకొని తదనుగుణంగా ధరించిన జోళ్లుకూడా కావవి.

ఆ దుబ్బులలో ఆ ముగ్గురు ఆడపిల్లలూ ఏం చేస్తున్నారు? వాళ్ళు ఆ దుబ్బులలో పాడుకొంటున్నారు. చుట్టుపట్ల చెట్లమీద చిన్న చిన్న పక్షులు కూడా పాడుకొంటున్నవి. గోదావరిలో చిన్న చిన్న అలలుకూడా నాగరీకులకు వినిపించకుండా పాడుకొంటున్నవి.

వాళ్లు వేసుకొన్న బట్టలు బీదబట్టలు—చిరుగుల బట్టలు —కాని జపాను బట్టలుమాత్రముకావు. ఈ కాలపు చదువుకొన్న స్త్రీలు కట్టుకొనే తళుకు తళుకు బట్టలుచూచే నాకళ్లకి వాళ్ల బీద చిరుగు బట్టలే అందముగా కనిపించేయి. సొంత సొమ్ములకీ ఎరువు సొమ్ములకీ ఉండే తేడాలాంటిదే యీ బట్టల తేడా అనుకుంటూ.

# "గోదావరి నవ్వింది"

వాళ్ల ముఖములు సహజ సౌందర్యమును బూడిదతో కప్పుకోలేదు. వాళ్ళ తలకట్లకు జపాను ఇంగ్లండు దేశములు అందము తీసుకురావడంలేదు.

గోదావరి గట్టున పెరిగే మోదుగు మొక్క దోరఎరుపు పువ్వుల్లాగ వాళ్లు పుట్టినట్లే ఉండి మెరసి పోతున్నారు.

సూర్యబింబం గోదావరిలో సగం దిగి పోయింది.

చిదుకులూ, కర్రముక్కలూ, వేళ్ళూ నింపిన తట్టలను తలపై పెట్టుకొని ఆ ముగ్గురు కన్యలూ నెమ్మదిగా గట్టెక్కి ఇంటిమొగము పట్టారు. తోవలో వాళ్ళను చూస్తున్న నేను వాళ్ళ కళ్ళకు తగిలేను.

పట్నవాసపు మనుష్యుల్ని పల్లెటూరి గేదెలు చూస్తే ఏం చేస్తాయి? అలాగే పట్టణవాసపు నన్ను వాళ్లు అలాగ బెదురుగా తప్పించుకు పోయారు.

నాగరీకగర్వమే నా తల కెక్కి ఉన్నట్లయితే వాళ్ళని "పశువు" లని ఇంగ్లీషున తిట్టిఉందును. ఆలోచించి నన్ను నేనే అనుకొన్నాను ఆ మాట. ఎందువల్లనంటే వాళ్లు మొక్కలు పూసే పువ్వులు. నేనూ నా తెగవాళ్ళమూ కాగితపుపువ్వులము.

వాళ్ళవెంబడే నేను నడుస్తున్నాను కొంతదూరంగా. సంక్రాంతిరోజు లవడంవల్ల గొబ్బిపాటలు జ్ఞాపకం చేసుకొంటున్నా రా పిల్లలు. ఆపాటలు విందామని కొంచెం వాళ్ళను సమీపించాను. వాళ్లు పాట ఆపి కళ్లు తళుక్కు మనిపించారు. నేను వెనక్కి తగ్గాను.

అప్పుడే గేదెలనూ ఆవులనూ తోలుకుంటూ గొల్ల పిల్లలు యిళ్ళకు వెడుతున్నారు. మీవేనా పశువులంటే మావే

అని నాకేసి వింతగా చూచి గేదెల నదలించారు.

పల్లెలకు వెళ్లుతున్నారు—పట్నవాసమునకు కార్యార్థులై వచ్చిన స్త్రీపురుషులు. కొందరుస్త్రీలు కావళ్లు మెడల మీద వేసుకువెళ్లుతున్నారు—వట్టికావళ్లు—బరువులేని కావళ్లు. పట్నవాసపు సరుకులు కొనుక్కొని పొట్లాలు మోసుకు పోతున్నారు కొందరు—ఇంగ్లండులో ప్రచురించే ఇంగ్లీషు న్యూసుపేపర్లతో కట్టిన పొట్లాలు.

ఎవరి పనిమీద వారు వెడుతున్నారు. పని లేకుండా ఆ గోదావరిగట్టున ప్రాణమున్న జీవ మేదీ లేదు—చదువుకొన్న నే నొక్కణ్ణి తప్ప!

సూర్యబింబం ఇంకా గోదావరిలో మునగలేదు పూర్తిగా. మేఘాలు సూర్యుడి రంగులతో అలంకరించుకొన్నాయి. గోదావరిలో అలలు పెద్దవౌతున్నాయి.

ఆడపిల్లలు ముగ్గురూ ఊసులాడుకుంటూ వెడుతున్నారు. తట్టల బరువు మూలాన్ని నడిచేటప్పుడు ఆ పిల్లలకు అందమైన మెడవంపులు కలుగుతున్నాయి.

వాళ్ళగ్రామం సమీపించాము. తాటాకు యిళ్ళ గ్రామం. పశువులు దూడల కోసం యిళ్ళకు పరుగెత్తుకు వెళ్లాయి. పసుల కాపర్లు వాటి వెనకనే వెళ్ళి కట్టివేస్తున్నారు.

ఆ ముగ్గురు పిల్లలూ వాళ్ళ వాళ్ళ యిళ్ళకు చేరుకున్నారు. వాళ్ళ తల్లు లప్పుడే బజారునుంచి బియ్యం కొనుక్కువచ్చి యిళ్ళకు చేరుకొన్నారు. వాళ్ళ తండ్రులూ అన్నలూ తమ్ములూ అప్పుడే కూలిపనులు ముగించి కూలి డబ్బులతో యిళ్ళకు వచ్చారు.

"గోదావరి నవ్వింది"

ఆ పిల్లలు వాళ్ళు తెచ్చిన చిదుకులూ కర్రలూ వాళ్ళమ్మలకు వప్పగించారు. వాళ్ళమ్మలు ఆ చిదుకులతో ఉడుకు నీళ్లుకాచి వాళ్ళ నాన్నలకూ అన్నలకూ స్నానం చేయిస్తున్నారు. ఆ చిదుకులతోనే వాళ్ళమ్మలు వాళ్ళ కుటుంబాని కంతకీ అన్నం వండుతున్నారు.

ఆనాటితో ఆ బియ్యం సరి. ఆ చిదుకులు సరి. మర్నాడు యథాప్రకారం పిల్లలు చిదుకులకు, తల్లి బియ్యానికీ, నాన్నలూ అన్నలూ కూలికి.

పక్షులకూ వాళ్ళకీ ఏమీ తేడా నాకు కనిపించలేదు. వాళ్ళకీ పక్షులకీ దేవుడుమీద—వాళ్ళను పుట్టించిన దేవుడు మీద—విశ్వాసముంది.

ఒక పక్షిదగ్గిరకువెళ్ళి, పక్షీ పక్షీ,రోజూ ఎందుకు తిండికి తంటాలు పడతావు, ఒకనాడే కూడబెట్టుకొని సుఖంగా కొంత కాలం కూచుని గడుపుకోరాదా అంటే ఏమంటుంది? ఈ ప్రపంచం అంతట్లోనూ భగవంతుడు జీవకోటికి కావలసిన యావత్తూ కూడబెట్టి ఉంచాడు. ఇం కెక్కడ నేను వేరే కూడబెట్టుకోడం—అంటుంది. నాగరీకుడికి నా కా మాటలలో సత్యం కనిపించదు.

గోదావరి కేసి తిరిగి చూచాను. సూర్యుడు మాయమయ్యాడు. గ్రామంలో జానపదులు భోజనాలు చేసి సుఖనిద్రలో మునిగిపోయారు.

నేను గోదావరిగట్టు చేరుకున్నాను. పక్షులు నిద్రపోతున్నాయి. చెట్లూ నిద్రపోతున్నాయి. నేను గట్టంట ఈదురోమంటూ నడిచివచ్చి పట్నం చేరుకున్నాను. పట్నంలో ప్రజలు ఇంకా ఇళ్ళమొహం పట్టలేదు.

# దీక్షితులు కథలు

## ౨

నాకు పట్నవాసంమీద అసహ్యం పుట్టింది. ఆపల్లెటూరికి వెళ్ళి అక్కడే ఉండిపోతే బాగుంటుం దనిపించింది. ఉదయమే గొల్లపిల్లలతో బయలుదేరి పశువుల్ని తోలుకుంటూ వెళ్ళి ఏ చెట్టునీడలోనో కూచుని ప్రకృతితో ఊసులాడుకుంటూ ఉంటే ఎంత బాగుంటుంది! చద్దిమూటలు విప్పుకొని చెట్లనీడల్లో తిని నా పశువులతోపాటు నేనూ ఆ గోదావరినీరు తాగి ఆచెట్ల నీడల్లో ఆడుకొంటూ ఉంటే! ఆ ప్రకృతి ఒళ్ళోనే అక్కడే నిద్రపోతే !

లేకుంటే, ఆ పిల్లలతోపాటు నేనూ ఒక గంప తీసుకొని చెప్పులు తొడుక్కొని పాటలుపాడే పక్షులు దాక్కొనే ఆ దుబ్బలలో చిదుకు లేరుతూ ఉంటే! పిల్లలతోపాటు నేనూ పాటలుపాడితే! మాతోపాటు ఆ పక్షులూ పాడితే! మాపాటలన్నీ గోదావరి వింటే! అయితే నాగరీకుణ్ణి ఆ పిల్లలు దగ్గిరికి రానిస్తారా? మనిషి ముట్టుకొన్న పక్షిని మళ్ళీ పక్షులు తమలో చేర్చుకోవట! న న్నా పిల్లలు వాళ్ళతో చిదుకు లేరనిస్తారా?

ఆ గ్రామంలోనే ఉండిపోయి ఆ గ్రామస్థుల వలెనే నేనూ నిర్విచారజీవనం చేస్తూఉంటే! ఆలోచించి చూస్తే నే నా పనికి తగనేమో అనిపించింది. కూలిపని చేసి కాయలు కాసిన చేతులు కావు నావి. ముళ్లల్లోనూ, చేలగట్లనూ తిరిగి మొద్దుబారిన పాదాలు కావు నావి. శీతోష్ణాల నొకమాదిరిగా గ్రహించ గలిగే దేహము కాదు నాది. ఉన్నదానితో సంతోషపడే చదువుకొన్నబుద్ధి కాదు నాది. ప్రపంచాన్నంతనూ నా యింట్లో పెట్టుకోవాలని ఆశించే చదువుకొన్నబుద్ధి నాది.

"గోదావరి నవ్వింది"

శీతోష్ణాలను నిరంతరమూ ప్రతిఘటించవలెనని ప్రయత్నముచేసే దేహము నాది. భూమిమీద మోపితే దానిమీదనుండే రోగ క్రిములను ఆకర్షించే పాదాలు నావి. బడి పుస్తకాలు మోపిన చేతులుగాని బండరాళ్లు మోపిన చేతులుగావు నావి.

అయినా మనస్సమాధానము చేసుకొన్నాను. పోనీ నేను చదువుకొన్నవాడనుగదా, నాకు వచ్చిన చదువు ఆ గ్రామస్థులకు చెప్పి తద్వారా జీవనోపాధి కల్పించుకోకూడదా అనుకొన్నాను. కొన్నాళ్ళు ఆ గ్రామంలోనే ఉండి గ్రామ సేవచేస్తూ వాళ్ళ కృతజ్ఞతపొందకూడదా అనుకొన్నాను—చూచారా, నా చదువుకొన్న ఊహ! నేను చదువు చెప్పినందుకు వాళ్ళు నాకు కృతజ్ఞత చూపాలిట! కూలిపని చేసేవాళ్ళు యజమానులు తమకుకృతజ్ఞత చూపా లనుకొంటున్నారా? చిదుకు లేరుకొనే ఆ కన్యలు తమతల్లులు తమకు కృతజ్ఞత చూపాలనుకొంటున్నారా? పశువులు కాసేవాళ్ళు ఆ పశువులు తమకు కృతజ్ఞత చూపాలంటున్నారా? సూర్యచంద్రాదులు కృతజ్ఞత నాశిస్తున్నారా? చదువు చెప్పబోయే నాకుమాత్రం ఆ గ్రామస్థులు కృతజ్ఞత చూపా లనుకొంటున్నాను!

తరవాత కొన్నాళ్ళు ఉన్నతరువాత ఆ గ్రామంలోనే గృహనిర్మాణం చేసుకొని ఒకయింటివాణ్ణి అవుతే! ఆ చిదుకు లేరుకునే ఒకపిల్లను పెళ్ళిచేసుకొని—

3

ప్రతిరోజూ గోదావరి గట్టున షికారు వెళ్ళడం మొదలు పెట్టాను. క్రమక్రమంగా ఆ గ్రామస్థులతో పరిచయం కల్పించుకొని, తరవాత వాళ్ళ సమ్మతిని గ్రామంలో ప్రవేశించవలె

నని సంకల్పం. ఊరిపెద్దల పరిచయం సంపాదించి ఒక చిన్నబడి పెట్టి తెలుగు, ఇంగ్లీషూ, లెక్కలూ, సివిక్సూ వగైరా శాస్త్రాదులు వాళ్ళకు బోధించవలెనని అనుకొన్నాను.

ఆ ముగ్గురి పిల్లలలో ఒక పిల్లతో స్నేహం సంపాదించుకొని క్రమక్రమంగా ఆ మెప్రేఘ దుర్గాన్ని ముట్టడించి పట్టుకోవా లనుకొన్నాను.

ఒకనాటి సాయంకాలం గోదావరి గట్టుమీద నిలబడ్డాను. చెట్ల ఆకులు ప్రతిరోజూ నన్ను చూస్తూండడం వల్ల నన్ను పరిచయస్తుణ్ణిగా భావించినవి.

చిన్నచిన్న పక్షులు కిల కిల మంటున్నవి. ఆ దుబ్బులలో నా కళ్లు వెదకడం మొదలుపెట్టినవి. ఎవరికోసమో నేను చెప్పడ మెందుకు? మీకు తెలుసును. దుబ్బులు వట్టి చేతులు తిప్పి నాకు ప్రత్యుత్తర మిచ్చినవి.

ఎదురుగా గోదావరి. గోదావరి అవతల చిన్న చిన్న మేఘాలు పొదిగిన ఆకాశం. ఆ గోదావరి అంచునుంచి ఒకపాట ప్రవహించి నా చెవులలో పడ్డది. అటు చూచాను. ఒకనల్లని విగ్రహం కనిపించింది. ఒక చిదుకు లేరుకొనే పిల్ల. ఒక పాట పాడుతోంది కాబోలు.

ఆ చోటికి కొద్దిదూరంలో ఒక మడి. ఆ మడిలో పని చేస్తూన్న ఒక పిల్లవాడు. ఆ పిల్లవాడు ఆ పాటను విని నడుమెత్తి గోదావరికేసి తిరిగి ఒక చిన్న పల్లెటూరిపాట ఆ పిల్లకేసి పంపేడు. ఆ పిల్లకూ, ఆపిల్లవాడికీ మధ్యనున్న అవకాశం వాళ్ళ పాటలకు బాట అయినది. ఆ బాటగుండా వాళ్ళ హృదయాలు ప్రయాణం చేస్తున్నవి. ఆ బాటగుండా ప్రయాణంచేసి

వచ్చిన ఆ పిల్ల హృదయాన్ని వాడు పట్టుకొని దాచుకొన్నాడు. ఆ పిల్ల వాడి హృదయాన్ని ఆ పిల్ల పట్టుకొని దాచుకుంది. గోదావరి ఈ తమాషా అంతాచూచి నవ్వింది. ఇదంతాచూచి నేను బిక్క మొహం వేశాను.

ఆ పిల్లవాడు మడి వదిలి ఆ పిల్లకేసి వస్తున్నాడు. ఆ పిల్ల చిదుకుల బుట్ట నెత్తిమీద పెట్టుకొని ఆ పిల్లవాడికేసి వస్తోంది. వాళ్ళిద్దరూ కలుసుకొన్నారు. వాళ్లిద్దరూ చేతులు కలుపుకొని గట్టువేపు వస్తున్నారు. ఇళ్లకు వెడుతున్నారు. ఆ పిల్ల బీద చిరుగులబట్టలే కట్టుకొంది. ఆ పిల్ల చిదుకులగంప యిటూ అటూ ఆడి ఆ పిల్లముఖాన్నీ మెడనీ యిటూ అటూ తిప్పించి అందాలు కురిపిస్తోంది. ఆ పిల్ల కళ్ళలోంచి ఆ పిల్లవాడి హృదయం తొంగిచూస్తోంది. ఆ పిల్లవాడి చేతులోకర్ర; తలకు తలపాగా, మొలకు గోచీ; వంటికి నల్లని తళతళ; కళ్లల్లో నుంచి ఆమె హృదయం తొంగి చూస్తోంది.

వాళ్ళు నన్ను చూచారు. చేతులు వదిలేశారు. దూర దూరంగా నడవడం మొదలు పెట్టారు. నన్ను వాళ్ళు సమీపించారు. ఆ పిల్ల నన్ను చూచింది. నిత్యమూ నేను ఆ పిల్లకోసం ఏరి ఉంచుతూ ఉన్న చిదుకులు ఆ నాడాపిల్ల తీసుకోలేదు. ఆ పిల్లవాణ్ణే నే నెరుగుదును. వాడు నన్ను పలకరించకుండానే వెళ్ళిపోయాడు.

నేను కొంతసేపు అక్కడే నిలబడిపోయాను.

౪

ఊరిపెద్దలతో ప్రసంగించాను. చదువుకోడానికి పిల్లలికి తీరుబడి లేదన్నారు. జీవనోపాధి వాళ్ళకు భగవంతుడేకో

కల్పించే ఉన్నాడు కాబట్టి వేరే ఈ చదువు జీవనోపాధి కల్పించవలసిన అవసరం లేదన్నారు. చదువు ఒక జీవనోపాధి కోసమే కాదనిన్నీ జ్ఞానాభివృద్ధి...యిత్యాదిగా చెప్పాను. చెప్పేటప్పుడే నా అంతరాత్మ నాకు జ్ఞాపకం చేసింది—ఏమనంటే, నేను చదువుకొన్నది జీవనోపాధికే అనీ, లోకమంతా యిప్పుడు చదువుకుంటూ ఉన్నది జీవనోపాధికే అనీ, ఆ గ్రామములో నేను చదువుచెప్పదలచుకొన్నది జీవనోపాధికే అనీ.

వాళ్ళడిగారు నన్ను, ఏమి చదువు చెప్పతావని. ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు, హిస్టరీవగైరా పేళ్ళు చెప్పాను. వాళ్ళొకమాట చెప్పేరు. వాళ్ళ ఊళ్ళో ఒక అమ్మాయి చదువుకోడానికి పట్నవాసం వెళ్ళిందిట. ఎవరో వచ్చి తీసుకువెళ్లారుట. ఆ పిల్లకు తల్లిదండ్రులు లేకపోవడంవల్ల వెళ్ళవీలయిందిట. ఆపిల్ల చదువుకొందిట. దానికి ఫలంగా ఆపిల్లకి వచ్చిందేమిటంటే! వేషాలు వేసుకుందామని తీరని ఆశా, వాళ్ళదేవుళ్ళని కొలవకపోవడం, తన గ్రామస్థులనుచూచి అసహ్యించుకోడమూ, అన్నిటికన్న గొప్పవిషయం—పెళ్ళిచేసుకోక పోవడం. నిజానికి పెళ్ళి చేసుకోకపోవడంలో ఆ పిల్లది తప్పేమీలేదుట. ఎందువల్లనో ఏ సంబంధమూ కుదరలేదుట. కాబట్టి వాళ్ళదేవుళ్ళని మరిపించే చదువు వాళ్ళ కక్కరలేదన్నారు. వేషాలు పెంచేచదువు వాళ్ళ కక్కర్లేదన్నారు. పెళ్లిని చంపే చదువు వాళ్ల కక్కరలేదన్నారు.

అయితే ఏమంటా రన్నాను. నేను ఆ గ్రామస్థులకు చదువు చెప్పే మాటయితే రాత్రివేళ రామాయణమో, భారతమో, భాగవతమో పాఠాలు చెప్పమన్నారు—నన్ను—

# "గోదావరి నవ్వింది"

ఇంగ్లీషు చదువుకొన్న నన్ను! నేను మాట్లాడలేను. నూటికి ముప్పైమూడున్నర తెలివితేటలు తెలుగులో సంపాదించిన నేను భారతభాగవతరామాయణాదులు పాఠం చెప్పడమా? సెలవుపుచ్చుకొని బయలుదేరాను.

సాయంకాలము గోదావరి గట్టునే వస్తున్నాను. పల్లెలకు పోయే స్త్రీపురుషులు ఎదురుపడ్డారు. అలవాటుచొప్పున దుబ్బులకేసి చూచాను. దుబ్బులు నన్నుచూచి నవ్వాయి. ఆ పిల్లకోసం గోదావరితీరం అంతా కళ్ళతో పరీక్షచేశాను. ఆ పిల్ల ఒక చెట్టు కొమ్మమీద కూచుని ఎండుపుల్లలు విరిచి కింద పడేస్తోంది. ఆ పిల్లవాడికోసం చూచాను. వాడు దూరాన్నున్న పశువుల నదలించి యింటిముఖం పట్టిస్తున్నాడు. నే నక్కడ ఆగాను. ఆ పిల్లవాడు చెట్టు మొదటకు వచ్చాడు. ఆ పిల్ల విరిచి పడవేసిన పుల్లలన్నీ ఆ గంపలోకి ఎత్తాడు. ఆ పిల్ల చెట్టు దిగుతోంది. ఆ పిల్లవాడు ఆ పిల్లకేసి చూస్తున్నాడు. వెనక్కు విరిచికట్టిన చీర, మెడమీదికి దిగజారుచున్న ముడి వేసిన పెద్ద జుట్టు, కాళ్లకు కడియాలు, పెదవులకు నవ్వులు, కళ్లకు తళుకులు.

పక్షి చెట్టుకొమ్మమీద గెంతడం చూచారా? చెట్టునంటిపెట్టుకొని పాకే తీగనుచూచారా? తొడిమవీడి కిందికి దిగజారే పువ్వును చూచారా? పిల్ల కిందకు దుమికింది చిన్న కొమ్మమీదనుంచి. పిల్లవాడు నవ్వాడు. పిల్లవాడు బుట్ట ఆమె నెత్తిమీద పెట్టాడు.

వాళ్ళు పాటలకు మెరుగులు పెడుతూ నడిచివస్తున్నారు. చెట్ల పూవు లొక్కొక్కటి వాళ్లమీద రాల్తున్నాయి. గట్టు

పక్క మోదుగు పువ్వులు రెండు తుంపి పిల్లవాడు ఆ పిల్ల కర్ణాల నలంకరించాడు. పక్షులు కిలకిల లాడుతున్నాయి. సూర్యుని అరుణకిరణాలు లోకాన్నంతనీ కప్పాయి కాని వాళ్ల మీద మరింత దట్టంగా పడ్డాయి. గోదావరి వాయువుద్వారా వాళ్ల కాశీర్వచనాలు పంపింది. వాళ్ళు గట్టెక్కారు. నన్ను చూచారు. "వెడుతున్నా, పిల్లా!" అన్నాను. "మంచిది, అన్నయ్యగారూ! మళ్ళీ ఎప్పుడొస్తా"రంది. ఆ పిల్ల విగ్రహమంతా నన్ను చూచి నవ్వినట్లయింది.

"వెడుతున్నానురా, అబ్బీ!" అన్నాను. "మంచిది, బాబయ్యా!" అన్నా డా పిల్లోడు.

వాళ్ళు నన్ను దాటిపోయారు. గోదావరి కేసిచూచాను. నిజమో కాదో నేను చెప్పలేనుగాని గోదావరికూడా నన్ను చూచి నవ్వినట్లయింది.

౧౯౩౬

---

# పెద్ద మేడ

ఆవీధిలో ఒక పెద్దమేడ ఉన్నది.

ఆ దారిని పోతూ ఉన్నవాళ్ళు తల ఎత్తి ఆ మేడకేసి చూచి మళ్ళీ తల కిందికి దించరు. ఆశ్చర్యపోతారు.

వాళ్లు ఆ మేడలో అందమే చూస్తారో, ఉన్నతే చూస్తారో, ధనదేవతనే చూస్తారో, చెప్పడము కష్టము.

ఆ మేడను ఆశ్రయించుకొని చాలా ఇళ్ళు ఉన్నవి. మండువా ఇళ్ళూ, పూరిళ్ళూ, గుడిసెలూ. ఆ యింటిపక్కనే రాములవారి కోవెల ఉన్నది. ఆ పెద్దమేడ మేఘమండలాలలో నుంచి కోవెలకేసి పెంకెతనపు చూపు చూస్తూ ఉంటుంది. ఆ చూపు తగిలి కోవెలలో ఉన్న రాములవారు ఒకమూలకు ఒదిగిపోయారా అనిపిస్తుంది.

ఆ మేడను డబ్బుతో కట్టారు.

మండువా ఇళ్ళనూ, పూరిళ్ళనూ, గుడిసెలనూ మర్యాదతో కట్టారు.

కోవెలను భక్తితో కట్టారు.

ఆ మేడను ఆశ్రయించుకొని కొందరు మనుష్యులున్నారు. వారు ఎప్పుడూ రూపాయల చప్పుడులో మునిగి ఉంటారు.

ఆరూపాయలచప్పుడులో పక్కకోవెలలోని తూర్యనాదాలు వారికి వినిపించవు. పక్క కుటీరాలలోని స్వచ్ఛహృదయ

పరిమళము వా రాఘ్రాణించలేరు.

ఆమేడలో గూడు కట్టుకొనడానికి ఒక పిచికైనా రాదు.

ఆ మేడమీద విశ్రాంతి తీసుకోడానికి ఒక పావురమైనా వాలదు. గంగడోలు గోకించుకోడానికి ఒక ఆవైనా ఆమేడ ముందు నిలువదు.

ఆగుడిసెలలో కొందరు మనుష్యులు కాపురమున్నారు. ఆ గుడిసెల చూరులలోనే కొన్ని పిచికలుకూడా కాపుర మున్నవి. ఆగుడిసెలపంచ పెరిగిన పచ్చ చెట్లమీద చిలకలు కబుర్లు చెప్పుకుంటవి.

ఆగుడిసెలపంచలలో మేకపిల్లలు సరదాగా ఆడుకొంటవి.

ఆవులు ఆ పంచలలో చేరి మెడా మెడా రాచుకొంటూ కూర్కు చెందుతవి. మనుష్యులూ, పక్షులూ, జంతువులూ అరమరికలేకుండా అక్కడ కాపురము చేస్తున్నారు.

కోవెలలో శ్రీరామచంద్రమూర్తి వెలిశాడు. రాముల వారి పాదదర్శనము కోరి ప్రతిఉదయమూ గుడిసెలలోని ప్రజలు ఆలయములో మూగుతారు.

రాములవారిద్వారా ధనదేవతను ఉపాసించడానికి మేడ లోనివారు బట్టలూ, పువ్వులూ, పండ్లూ అనే లంచాలతో అక్కడికి ప్రతిఉదయమూ వస్తారు.

కోవెలగూళ్ళను పావురాలు స్వగృహాలు చేసుకొన్నవి. కోవెల ముందున్న వరికంకులను పిచికలు స్వేచ్ఛగా అనుభ విస్తవి. కోవెలగోపురాలమీద చిలకలు విశ్రాంతికై వాలి మనశ్శాంతి పొందుతవి.

కోవెలముందు ఆ దారిని పోయే ఆవులు ఆగి కనురెప్ప

లతో నమస్కారాలు రాములవారి పాదాలకు సమర్పిస్తవి.

రాములవారి ఎదుట పావురాలు మొగ్గలువేసి వినోదము కల్పిస్తవి.

రాములవారి ఒడిలో పిచికలు సుఖనిద్ర పొందుతవి.

రాములవారిపలుకులు అనుకరించఁబోయి చిలకలు చిన్నబుచ్చుకొంటూ ఉంటే, రాములవారు విలాసముగానవ్వుతారు.

రాములవారికి వసంతోత్సవము జరిగే కాలాన కోకిలలు తూర్యనాదాలతో తమస్వరాలు కలిపి ఆ ఉత్సవానికి కొత్త అందము తీసుకు వస్తవి.

గోవులు తమ కోమలహృదయకోరకాలను రాములవారి కర్పించి సమాధి చెందినట్లు కోవెలపంచ నిద్రపోతవి.

మేడలోవారు బజారులో కొని తెచ్చిన పువ్వులను శిఖలలో ధరిస్తారు. గుడిసెలముందు పూలమొక్కలు నవ్వినపువ్వులు రాములవారి దేహము నాశ్రయించి పావన మౌతవి. తరువాత గుడిసెలలో వారి శిఖలలో ప్రవేశిస్తవి.

సంక్రాంతిపండుగ వచ్చింది.

రాములవారికి ప్రతిరోజూ ఉత్సవాలు జరుపుతున్నారు ప్రజలు. ఆ ఉత్సవాలు చూచి మనుష్యులూ, పశుపక్ష్యాదులూ అందరూ సంతోషిస్తున్నారు.

సంక్రాంతి పండగనాడు గుడిసెలన్నీ ముస్తాబైనవి. గుడిసెలముందు రకరకాలముగ్గులు వికాసము చూపుతున్నవి.

పెద్దమేడకూడా ముస్తాబైంది. ఆ ముస్తాబు చమ్కీబట్టల ముస్తాబులాగ ఉన్నది.

కోవెలకు దివ్యతేజస్సు ఆ నాడు వచ్చింది. రాములవారి

హృదయము భక్తులప్రార్థనలవల్ల మహాసముద్రమై ఉప్పొంగి పోతూ ఉన్నది. రాములవారు ఆనాడు చాచిన రెండుచేతుల మధ్యకూ ఎందరైనా పోయి దివ్యసౌఖ్యములు పొందవచ్చు నన్నట్లున్నవి. ఆ దేవునికౌగిలిలో ప్రపంచము లన్నీ ఇముడ గలవు. ఆ కౌగిలికి అనంతమైన వారము. ఆ కౌగిలిలో ఊహకు అందని ఆనందము నిబిడీకృతమై ఉన్నది. ఆ కౌగిలిలో ఆనం దము నూతనజీవనమును ప్రసాదించ గలదు.

అటువంటి కౌగిలి ఆనాడు ప్రజలకు రాములవారి అపారకృపావిశేషముచేత కలిగింది.

గుడిసెలలోనివారు ఆ కౌగిలిలో చిక్కుకొన్నారు. చిల కలూ, కోయిలలూ, గోవ్రులూ, మున్నగు భక్తులందరూ కౌగి లివిందు గైకొని సౌఖ్య మనుభవిస్తున్నారు. మేడవారికి రా ములవారి కౌగిలి కనబడలేదు. రాములవారు చేసుకొన్న ముస్తాబుమాత్రము చూచి వారు మురిసినారు.

కోవెలముందుకూడా సంక్రాంతిముగ్గులు పెట్టారు. పెద్ద రథము, గంటలరథము, జెండాలరథము సర్వాంగసుందరమై కోవెలముందు అది జీవకళలతో ప్రకాశిస్తున్నది. ఆ రథము మీద అంటిటూ పువ్వులు హసిస్తున్నవి. ఆ రథముమీద పసు పుకుంకుమం పావనత్వాన్ని వెదజల్లుతున్నవి. ఆ రథంమీద రా ములవారు కూర్చున్నారా అన్నమోస్తరుగా అది ప్రకాశిస్తు న్నది. పెద్దమేడముందుకూడా ముగ్గులున్నవి. రథములు, గుం టలకోనేళ్లు, తాబేళ్లు, పాములు, గుమ్మడిపండ్లు - ఎన్నోరకాల ముగ్గులు. ఆ ముగ్గులమీద పువ్వులూ ఉన్నవి. అవి అన్నీ ఆ యింటిముందు కునికిపాట్లు పడుతూఉన్నట్లున్నవి.

59

## పెద్ద మేడ

మహావైభవముతో తాను చేసుకొన్న ముస్తాబు చూచుకొని, పక్క గుడిసెల ముస్తాబు ఆ కళ్ళతోనే చూచి పెద్దమేడ నవ్వింది. గుడిసెలు తమ ముస్తాబు చూచుకొని, పెద్దమేడ ముస్తాబు చూడజాలక కోవెలపక్క కొదిగి ప్రతినవ్వు నవ్వినవి.

మేడ కోపముతో ప్రశ్నించింది :

"ఎందుకు నన్ను చూచి నవ్వుతారు?"

"నీ నవ్వుకు ప్రతిగా మేము నవ్వాము."

"నా అంతస్థులు విశాలములు. అందులో కళాశోభితములైన స్తంభాలు సుందరములు. నా గోడలమీది చిత్రములు రంగులతో పులకరిస్తూ ఉంటవి. నా శిఖరముమీది గోపురము లతాద్యలంకారాలతో కిరీటశోభ పొందుతున్నవి. నాలో అందమంతా ఇమిడి ఉన్నది. వీటిని అతిశయించే నా ఉన్నతి మీరు కళ్ళెత్తి చూడరానిది. నా నవ్వుకు కారణము ఇప్పుడు మీకు బోధపడిందా ?"

"ఆ ఉన్నతి చూచుకొని నీవు నవ్వావు కాబోలు. నీ అంతస్థుల అమరిక మా ధైర్యమువల్ల కలిగిందే. కళాశోభితమైన స్తంభాలు మా కౌశలమునే ప్రకటిస్తున్నవి. గోడలమీది చిత్రాలు మా ఓర్పుకూ, నేర్పుకూ నిదర్శనాలు. నీ కిరీటము నీకు మేము పెట్టిందే. నీ ఉన్నతి నీకు మేము కల్పించిందే."

"మీ ధైర్యమును, మీ కౌశల్యమును, మీ ఓర్పును నేను మీకు ప్రతిఫలమిచ్చి కొనుక్కున్నాను. అందువల్ల వాటి ప్రసక్తి మీకు ఉండరాదు."

"మా కౌశల్యాదులు తుచ్ఛమైనధనముతో సరితూగవు."

ఈ సంభాషణ విని కోవెల ఫక్కున నవ్వింది.

ఆ నవ్వు విని గుడిసెలు సిగ్గుతో తలలు వంచుకొన్నవి. ఆ నవ్వు చూచి పెద్దమేడ అపరిమితమైన ఆనందముపొందింది.

చాలా కాలము గడచింది.

గుడిసెలుండేచోట ఒక వనము పెరిగింది. ఆ వనములో పూలమొక్కలూ, పళ్ళచెట్లూ, దుబ్బులూ ఎక్కువగా పెరిగినవి. పూలమొక్కలమీద తుమ్మెదలూ, సీతాకోకచిలుకలూ ఆడుకొంటూ ఉంటవి ఎప్పుడూను. పళ్లచెట్లమీద నివాసము ఏర్పాటుచేసుకొని రకరకాలపక్షులు పళ్లు తింటూ గానము చేస్తూ ఉంటవి. దుబ్బులలో అనేకరకాల కీటకములూ, చిన్న జంతువులూ, చిన్నపక్షులూ తలదాచుకుంటూ ఉంటవి. ఆ వనమంతా ఎప్పుడూ కలకల లాడుతూ ఉంటుంది.

కోవెల ఉండేచోట ఒకరావిచెట్టు మొలిచింది. ఆ రావి చెట్టు ఆ ప్రాంతాల జంతుజాలాని కంతకూ చలవ ఇస్తూ ఉంటుంది. ఆ రావిచెట్టు మొదటా, కొమ్మలమీదా, ఆకులమీదా అంతా జీవకోటే. రావిచెట్టు ఆకుల గలగల జంతుజాలాన్ని అంతనూ జోకొట్టుతూ ఉంటుంది.

పెద్దమేడ ఉండేచోట రాళ్ళగుట్టలు ఉన్నవి. ఆ గుట్టల చుట్టూ బొమ్మచెముడు మొలిచిపోయింది. ఆ గుట్టలనిండా పాముల పుట్టలు. రాత్రివేళ గుడ్లగూబలు ఆ గుట్టలెక్కి కూస్తూ వుండడంకూడా కద్దు.

రావిచెట్టు ఆ గుట్టలమీదకూడా పళ్ళు రాల్చి మొలకలు మొలిపించాలని చూస్తూ ఉంటుంది. కాని జంతువులు ఆ మొలకలను బతకనియ్యవు.

౧౯–౪౯

# వామహస్తోద్ధారక సంఘము

మంగయ్యఉద్యోగము పోవడముకు అనేకమంది అనేక కారణాలు చెప్పారు. లక్షణమైన గవర్నమెంటు ఉద్యోగం పోవడమంటే సామాన్యము కాదు. ఉద్యోగముతోపాటు అధికారమూ, జీతమూకూడా పోయినట్లేగదా. అంతకంటె ముఖ్యమైన సంగతి - నెలజీతాన్ని మించిన డబ్బు-దోసిళ్లాది డబ్బు కూడా పోవడము తటస్థించింది. ఆ కారణముచేత మంగయ్య ఉద్యోగముపోవడాన్నిగురించి అతని మిత్రులలో కలవరం పుట్టిందంటే ఆశ్చర్యము లేదు.

వారుచెప్పిన కారణాలలో ఒకటి ఏమిటంటే- ఒకనాడు ఒక తెల్లదొర ఆఫీసు తనిఖీచేయడానికి వచ్చాడు. మంగయ్య ఆయన దర్శనం చేసుకొన్నాడు. వారి కిద్దరికీ జరిగిన సంభాషణలో మంగయ్య "మాది గోదావరిజిల్లా" అని చెప్పినట్లూ, దొర "గొడావెరిజిల్లా ఏఊరు?" అని దొర అడిగినట్లూ, "గొడావరి" కాదు గోదావరి అని మంగయ్య తప్పు దిద్దినట్లూ, తన తప్పు సవరించుకోకుండా తెల్లదొర "గొడారీజిల్లా" కాదా అని ముఖంఎర్రజేసినట్లూ, "గోడారీ" కాదు గోదావరి అని మంగయ్య మళ్ళీ చెప్పినట్లూ దానిమీద దొర కోపం పట్టలేక, శ్వేతప్రభుత్వగౌరవమును నిలవబెట్టే ఊహతో మల్లసంప్రదాయసిద్ధముగా చేతులను సవరించుకున్నట్లూ, తరువాత మంగయ్య

శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్మను వాక్యమును జ్ఞాపకముచేసి కొని, పారిపోయినట్లూ, మరునాడు ఉద్యోగముపోయినట్లూ కొందరు చెప్పుచున్నారు.

కాని నిజమైన కారణ మదికాదు. అంటే అది ఒకటే కాదు. మంగయ్యపైని అధికారం చలాయించే అధికారి పరం పరలో ఒకపూర్వాచారపరాయణుడైన నల్లదొర ఉన్నాడు. ఆనల్లదొర దగ్గిరకు మంగయ్య కాగితాలు దస్కతు చేయించు కోవడానికి వెళ్లుతూ ఉండేవాడు, ప్రతిరోజును. ఎన్నిమాట్లు వద్దని చెప్పినా మంగయ్య ఎడమచేతితో కాగితాలు అధి కారికి అందించేవాడు. ఆరీతిగా చేయడంతప్పని అధికారి ఎన్నిమాట్లు మందలించినా అలవాటుచొప్పున మళ్లీ మళ్ళీ ఎడమచేతితోనే కాగితాలు అందించేవాడు. అధికారికి కోపం వచ్చి, మంగయ్య అవిధేయతతో మెలగుతూ ఉంటాడని పై ఉద్యోగస్తులకు వ్రాసినాడు. అవిధేయత ఒక కారణమూ, గోదావరీ చర్చ వొక కారణమూ — ఈరెండు కారణాలూ మం గయ్య వుద్యోగమును పోగొట్టినవి.

మంగయ్య ఉద్యోగము పోవడముకు ఎడమచెయ్యి కా రణమైనదన్న సంగతి ఎడమచేతులలో పొక్కింది. ఎడమచే తులు చేసేకార్యాలన్నీ నీచములని ప్రజలు గ్రహించుచున్నట్లు అవి గ్రహించినవి. కొంతకాలానికి ఎడమచేతులన్నింటికీ ప్రబో ధం కలిగింది. వెలుగులో పడ్డవి. కుడిచేతులుచేసే పనులు గౌర వాస్పదములన్న సంగతికూడా అవిగ్రహించినవి. కుడిచేతులమీద ఎడమచేతులు కత్తి దూసినవి. నలుసంత నిప్పంటే ఎన్నిగ్రామా లైనా తగులపడతవి. మహాసంగ్రామానికి కారణము ఎంత సూ

## వామహస్తోద్ధారక సంఘము

క్ష్ణమో అందరూ గ్రహించినదే. కుడి ఎడమచేతుల మహా సంగ్రామానికి కూడా మంగయ్య ఉద్యోగంపోవడమనే చిన్న విషయమే పెద్ద కారణమయినదనడములో ఆశ్చర్యమేమీ లేదు.

కుడిచేతులనుచూస్తే పూర్వం అన్యోన్యంగా ఉండేవి ఇప్పుడు కుడిచేతులమాటతలపెట్టితే తలకంటగించుకొనుచున్నవి ఎడమచేతులన్నీని. కుడిచేతులుమాత్రం ఎడమచేతులను చూచి నవ్వేవి. ఆనవ్వు పరిహాసంక్రింద ఎడమచేతులు భావించి వాటిని మరీ అసహ్యించుకొనేవి. ఈరీతిగా కొన్నాళ్ళు జరిగినది.

ఐకమత్యం బలమనే న్యాయం జ్ఞాపకం చేసుకొని ఎడమ చేతులన్నీ ఆవిషయాన్ని గురించి పెద్దపెద్ద ఉపన్యాసాలు వగైరాచేసి చివరకు ఒక సంఘం స్థాపించుకొనుటకై తీర్మానము చేసుకొన్నవి. దానికి "వామహస్తోద్ధారకసంఘ"మని పేరు పెట్టినవి. స్వసంఘపురోభివృద్ధికి ముఖ్యముగా పాటుపడుటకై ఈసంఘము నేర్పాటు చేసినట్లు అవి ప్రకటించుకొన్నవి.

సంఘమనడముతోనే దానికి అధ్యక్షుడు వగైరా లాంఛనాలన్నీ వుండవలెనుగదా. అందుకని చెప్పి "మంగయ్య వామహస్తము అధ్యక్షుడుగా ఉండుటకై ఎడమచేతుల సభలో తీర్మానమైనది. అన్నిపనులూ ఎడమచేతితోనే చేస్తూన్న ఒక స్థూలకాయుని స్థూలవామహస్త మువాధ్యక్షపదవి గ్రహించినది. ఎడమచేతితోనే వ్రాతవ్రాసే ఇంకో ఆసామీ వామహస్తము కార్యదర్శిపద మలంకరించినది. ఎడమచేతితో రూపాయలు ఎంచడము, బొత్తులుపెట్టడము మొదలైన కార్యములుచేసే ఇంకో వామహస్తము కోశాధ్యక్షపదవి స్వీకరించినది. మిగిలిన ఎడమచేతులన్నీ సభ్యులైనవి. ఈరీతిగా ఒక

సంఘమును ఏర్పాటు చేసికొని అవి అనేకతీర్మానములను అనేకసభలలో ప్యాసుచేసికొన్నవి. వాటి వాద మిది.

'అనాదినుంచీ విద్యాగంధము లేనివాటినిగా జేసి కుడిచేతులు మమ్ము అనాదరణ చేస్తూ వున్నవి. కుడిచేతులూ, మేమూ ఒక్కమోస్తరుగానే పుట్టితిమి. వాటిని కోస్తే పాలూ, మమ్ము కోస్తే రక్తమూ రావడము లేదు. ఒకమోస్తరు రక్తమే, ఒకమోస్తరు ఎముకలే, ఒక మోస్తరు కండలే, ఒక్కటేపొడవు, ఒక్కటే నిర్మాణము మాఉభయులకూ గలవు. భగవంతుడు మాకన్యాయము చేయలేదు. కుడిచేతులే మా కన్యాయముచేసినవి.

కమ్మని భోజనము లారగించుటకు కుడిచేతులే కావలెను. కష్టతరమైన కార్యములు చేయుటకు కుడిచేతులే కావలెను. బరువులుమోయుటకు, చెట్లు కొట్టుటకు, చిత్తరువులు వ్రాయుటకు, రాళ్ళుమలుచుటకు యంత్రములు నడుపుటకు సమస్తకార్యములకూ కుడిచేతులే కావలెనట. చక్కనివ్రాత వ్రాయుటకూ చదివేటప్పుడు పుస్తకము పట్టుకొనుటకూ కుడిచేతులే కావలెనట. చదువుకూ వ్రాతకూ మమ్ము ఈరీతిగా దూరముచేస్తూఉన్న వీ కుడిచేతులు. విద్యాగంధము లేనివాటినిగా ఈ కుడిచేతులు మమ్ముచేసి తరువాత విద్యాగంధము లేదని ఆక్షేపించుచున్నవి. ఆడవాళ్ళతో షేక్‌హాండు చేసికొనుటకు, పుష్పములతో దేవునిపూజించుటకు, దేవునికి అభిషేకముచేయుటకు కుడిచేతులులేనిదే జరుగదు. ఇక మేము ఆడారివాళ్లలాగ ముసుగువేసుకొని ఇంట్లోకూర్చోవలసినదే.

మేము నాజూకువాళ్ళం కాబట్టి కష్టమైనపనులు చేయ

లేమట. మమ్మ్ము నాజూకుగా చేస్త యీకుడిచేతులే. ఇప్పుడు మమ్మ్ము నాజూకని ఆక్షేపిస్తూవుంట ఈకుడిచేతులే. మాకుచేసిన ద్రోహం ఇంతాఅంతా అని చెప్పడానికి వీలులేదు. ప్రతి నీచ కార్యానికీ మమ్ము నియోగించడమూ, ప్రతీఘనకార్యానికీ తాము తగుదు మమ్మ్మాఅని పురస్కరించుకొని పనిచెయ్యడమూను. ఇంత అన్యాయం ఎక్కడైనా కద్దా?

చూడండి తెల్లదొరల చేతులు. భోజనానికి కుడి ఎడమ భేదంలేకుండా రెండుచేతులూ ఉపయోగపడుచున్నవి. ఏనీచ కార్యానికైనా ఒక్క ఎడమచేతులే చెయ్యాలనికాని లేక ఒక కుడిచేతులే చెయ్యవలెనని కాని లేకుండా ఏలాగవీలుగా వుంటే ఆలాగ పనికి వస్తున్నవి. ఇంతెందుకూ! ఒక్క గోకుకోవడము మాట ఆలోచించండి. మాసంఘములో గోకుకోవడము కూడా కుడిచేతులే చేయవలెనట! అందుకు మేము పనికి రామట. తెల్లదొరలలో ఏవైపు దురదుంటే ఆవైపుచెయ్యి గోకుతుంది. ఈఆచారము జంతువులలో కూడా వుంది. కోతులలో ముఖ్యముగావున్నది. మమ్ము ఈకుడిచేతులు కోతులకన్నా, జంతువులకన్నా హీనముగా చూస్తూవున్నవి. ఈదాస్యములో ఎంతకాలము మేముండడము. పాముంటిదానికి విరుగుడు ఉంది, ఈకుడిచేతులకు ఉండకపోతుందా చూద్దాము.

మమ్ము యీకుడిచేతులు నీచముగాచూస్తూన్న వనుటకు యింకో నిదర్శనం. కుడిచేతులు మాకు పుర్రచేతులనే అవమానకరమైన పేరుపెట్టి ఆక్షేపిస్తూవుండడము అందరూ ఎరిగిన విషయమే. ఎడమచేతులతో వ్రాతమొదలగు పనులుచేసే వారిని పుర్రచేతివాళ్ళని, ఆడారిపెద్దమ్మలనీ గేలిచేయడం సర్వ

సామాన్యము. ఇకముందు ఇట్టి నీచనామములు మనకుంచరాదని మనము గట్టిగా తీర్మానముచేయవలవున్నది.” ఇంతటినుండీ ఎడమచేతులన్నీ దొరలసాంప్రదాయము ననుసరించుచు ఘనకార్యాలన్నీ తామే చెయ్యడము మొదలుపెట్టినవి. ఆ దేశములో ఎక్కడచూచినా ఎడమచేతితో భోజనముచేసేవారే, వ్రాసేవారే, ఎడమచేతితో టెన్నీసాడేవారే. ఈరీతిగా కొంతకాలం జరిగింది. ఇక కుడిచేతులు ఏమిచేసినవంటే, అవికూడా ఒకసంఘమును ఏర్పాటుచేసుకొని, ఒకటిరెండు పత్రికలు స్థాపించి కార్యక్రమము నడిపించుటకు మారుగా ఎడమచేతులవాదమును మాత్రము ఖండించి ఊరుకొన్నవి. వామహస్తోద్ధారకసంఘవాద ఖండనము అనుపేరుతో ఈరీతిగా అవిప్రకటించినవి.

“శ్రుతిస్మృతి పురాణేతిహాసములను తరచితరచి చూడగా ఎక్కడా కుడిచేతులకే ప్రాధాన్యమున్నదికాని ఎడమచేతులకు లేదనీ, ఆచారముకూడా ఆరీతిగానే ఉన్నదనీ, పూర్వాచారములను మీరి సంచరించడము సంఘమునకనర్థదాయకమనీ, కలికాలప్రభావమువల్ల యిట్టిఆందోళనలు సంఘములో పుట్టుచున్నవనీ ఇంతకీ కుడిచేతులు ఎడమచేతులకు అపకారము చేస్తూవున్నవని చెప్పిన హేతువులు హేతువులుకావనీ, ఎడమచేతులకూ కుడిచేతులకూ సమానమైన హక్కేవున్నదనీ ఇంకా ఏమేమో చెప్పినవి.

చేసే ప్రతిపనికీ కుడి ఎడమ చేతు లుపయోగపడుచున్నవనికూడా అవి చెప్పినవి. భోజనము చేసేటప్పుడు మంచినీళ్ళు త్రాగుటకు ఎడమచేతులే ఉపయోగపడుచున్నవి. చెట్లు కొట్టుటకు కుడిచేతు లెంత అవసరమో ఎడమచేతులుకూడ అంతఅవ

సరమే. చిత్తరవులు వ్రాయుటకు కుంచె కుడిచేతులో ఉంటే రంగులపలక ఎడమచేతిలోనే ఉంటుంది. ఇంక వ్రాతవిషయములో ఎడమచేయి కాగితం పట్టుకొంటేనేగాని కుడిచేయి వ్రాయనేలేదు. చదువు విషయమై ఎడమచేతులు అబద్ధములను వ్రాసినవి. ఎడమచేతుల వాదమంతా అబద్ధములతోనూ, హేత్వాభాసలతోనూ నిండియున్నది. చదువుకోనేటప్పుడు ఎడమచేతులే పుస్తకమును పట్టుకొనుచున్నవి కాని కుడిచేతులు కావు. కుడిచేతులు పత్రములు తిరగవేయుటకు మాత్ర ముపయోగించుచున్నవి. ఇంక ఎడమచేతికి ప్రాముఖ్యమున్న యితర విషయములు ఆలోచిద్దాము. పెండ్లిండ్లలో ఎడమచేతితోనే తాను ప్రేమించిన వధువుకుడిహస్తమును పట్టుకొనుచున్నాడు వరుడు. అర్థనారీశ్వరుడగు శివుడు తన ఎడమభాగము జగజ్జననియగు పార్వతికి పంచియిచ్చాడు. ఇంక దేవతావిగ్రహాల్లో కుడి ఎడమ భేదం లేనేలేదు. ఒక చెయ్యి అభయహస్తం. ఒక చెయ్యి వరదహస్తం. ఇత్యాదిగా ఉంటున్నది. ఎన్నివిధాల చూచినా ఎడమచేతులకు కుడిచేతులు అనాదారణ చేస్తున్నట్లులేదు. మాయాప్రపంచాన్ని కల్పించుకొని చేయని అపచారములు కుడిచేతులు తమకు చేస్తున్నాన్నట్లు అవి ప్రకటించుకొనుచున్నవి. దానివల్ల వాటికేమి ఉపయోగమో తెలియదు. తెల్లవాళ్ళతో జట్టుకట్టి డబ్బు సంపాదించుకోవాలంటే ఇతర మార్గములు లేవా? ఇక గోకుకోవడం సంగతి. న్యాయానికి రెండుచేతులూ గోకుకోవడానికి పనికివస్తూనే వున్నవి అందులో ముఖ్యముగా ఎడమవేపు దురదకు కుడిచేతులూ, కుడివేపుదురదకు ఎడమచేతులూ ఉపయోగపడుతూనే ఉన్నవి. కుడిచేతికి

దురదపెట్టితే కుడిచేతులే గోకుకోవడము లేదుకదా? అంత గోకుకోవడమనేది ఘనకార్యముక్రింద భావించుకొన్నట్లైతే ఆ ఘనకార్యమును ఎడమచేతులు చెయ్యడానికి ఏమీఆక్షేపణలేదు.

వీణ వాయించేటప్పుడు, పిల్లంగ్రోవి ఊదేటప్పుడు, కుడిచేతులెంత ఉపయోగపడుచున్నవో ఎడమచేతులుకూడా అంత ఉపయోగపడుచున్నవనే సంగతి ఎడమచేతులు మరచిపోవడము ఎట్టిచిత్తవృత్తిని తెలియచేస్తున్నదో ప్రాజ్ఞులుగ్రహించకపోరు.”

ఈరీతిగా ఖండనమువ్రాస్తే దానికి ప్రతిగా ఎడమచేతులన్నీ ‘వామహస్తోద్ధారకసంఘవాదఖండనముండన’మనే పేరుతో వేరొక వ్యాసమువ్రాసి ప్రకటించినవి. వధువును ఎడమవేపుపెట్టుట ఎడమచేతుల గౌరవమునకు కాదనీ, స్త్రీలుసంఘములో నీచస్థానమును ఆక్రమిస్తున్నారు కాబట్టి నీచమైన ఎడమచేతిక్రిందనే వారిని పెట్టడము తటస్థించినదనీ, ఇంక మానవుడుచేయు ప్రతికార్యములోనూ ప్రాముఖ్యత కుడిచేతులకేగాని ఎడమచేతులకు లేదనీ, కుడిచేతుల వాదమంతా స్వవచనవ్యాఘాతాలతో నిండియున్నదనీ, ఎడమచేతులన్నీ మేల్కొని కుడిచేతుల దుర్నయములనూ, దుర్మార్గములను అరికట్టితేనేగాని సంఘము బాగుపడదనీ, స్వరాజ్యమురాదనీ వ్రాసుకొన్నవి.

వీరివాదము ఈరీతిగా ఉంటూండగా పులిమీద పుట్ర అన్నట్లు దేశమందంతటా అనేకసంఘములు బయలుదేరినవి. అందులో ముఖ్యముగా చెప్పతగ్గవి “అంగుళీసంఘములు”. స్వశాఖాభివృద్ధినీ, స్వశాఖోత్కృష్టతనూ సూచించుటకై ఈ అంగుళీసంఘములు స్థాపింపబడ్డవి.

అంగుష్ఠాంగుళీసంఘము తామే పెద్దలమని లోకము

నకు చాటుటకు స్థాపింపబడ్డది. అన్నివేళ్ళకంటె అవి పెద్దవి కాబట్టిన్నీ, బొటనవ్రేళ్ళులేనిదే ఏవస్తువునూ పట్టుకొనుటకు వీలులేదు కాబట్టిన్నీ వాటికే ఆధిక్యతఉన్నదని వాటివాదము.

తర్జన్యాంగుళీసంఘము తామే గొప్పవారమని ప్రకటించుకొనుటకేర్పడ్డది. నిర్దేశించుటకు దేనిని చూపవలసివచ్చినా తమ సహాయములేనిదే జరగదు. కాబట్టి వాటికి ఆధిక్యతకలదు అని వాటివాదము. మధ్యమాంగుళీసంఘము పొడుగునుబట్టి అధిక్యత కోరుచున్నది. అనామికసంఘమువారు తమకు అనామకులని శత్రువులు పేరుపెట్టి అన్యాయముచేసినారనీ, తామే బంగారమెప్పుడూ ధరించవలసిన ఐశ్వర్యవంతులమనీ కావున తమకే ఆధిక్యముండవలెననీ వాదించుచున్నారు.

కనిష్ఠికాంగుళీసంఘమువారు తమ్ము అందరూ కడవారిగా చూచి తమకు తగని పేరుపెట్టినారనీ, తాము అల్పులు కాబట్టి తమకే ఆధిక్యమీయవలసినదనీ, వాదించుచున్నవి. ఈ అంగుళీసంఘములు తమలో తాము పోరాడుకొనడమేగాక వామహస్తములతోనూ, దక్షిణహస్తములతోనూ హోరాహోరి పోరాడుటకు రణరంగమున దిగినవి.

స్థితిగతు లీ రీతిగా ఉండగా మిగిలిన తెగలకుకూడా ప్రబోధము కలిగించి నేత్రోద్ధారక సంఘము, ఉదరోద్ధారక సంఘము, పాదప్రబోధసంఘము శ్రోత్రోపకారిణీసంఘము యిత్యాది సంఘము లనేకములు బయలుదేరి తమతమ సంఘములను బాగుచేయు ఉద్దేశ్యముతో పనిచేయుచున్నవి, కాని యీసంఘములు అధ్యక్షాదుల నెన్నుకోవడము యిత్యాదిపనులతోను. సాలుసాలుకు కొన్నితీర్మానములను ప్యాసుచేసుకోవ

డముతోను తృప్తి పొందినవి. వామవాస్తోద్ధారకసంఘము మాత్రముచాలా పట్టుదలతో పనిచేసినది. కుడిచేతులపనులన్నీ ఎడమచేతులు చేయడము మొదలుపెట్టినవి. కుడిచేతులను నిర్లక్ష్యముచేసి ఏపనీ వాటికిలేకుండాచేస్తే అవికృశించిపోవుననీ, ఆపైని అన్నిపనులూ తామే చేసుకోవచ్చుననీ ఎడమచేతులు భావించినవి. ఇకముందునుంచి ఎడమచేతులన్నీ తమ పేర్లను మార్చుకొని కుడిచేతులనే పేళ్లుపెట్టుకోవలెననే తీర్మానములు కూడా సభలలో చర్చకువచ్చినవి. కొన్ని ఎడమచేతులు కుడి చేతులనుపేరుతోనే వ్యవహరింపబడడంకూడా తటస్థించింది.

కుడిచేతులు పని లేకపోవడంవల్ల విశ్రాంతి తీసుకోవడం మొదలుపెట్టినవి.

సంఘములు క్రొత్తగా స్థాపించినకాలములో ఎడమచేతి చిటికినవేలూ, అనామికా కలసి కలం పుచ్చుకొని వ్రాతలు వ్రాయడం నేర్చుకొన్నవి. కాని ఆకలం క్రమక్రమంగా బొటన వ్రేలు సమీపానికి వస్తూవున్నది. కొంతకాలానికి కుడిచేతిలోనికి కూడా రావచ్చునని ఈమధ్య కొత్తగా స్థాపించిన "వరాహ మిహిరజ్యోతిషాలయము" వారు ప్రకటించినారు.

ప్రస్తుత పరిస్థితులనుబట్టి భవిష్యత్తు ఏలాగ వుంటుందో నిర్ణయించడము కష్టము కాని ప్రస్తుతము దీని పర్యవసానమే మిటంటే మంగయ్యకు మంచి ఉద్యోగము దొరికినది. పూర్వ మువలెనే దోసిళ్ళాది డబ్బు గడించుకొంటున్నాడు.

పనిపాటలులేని కవులకూ, వ్యాసకర్తలకూ, నవలాకారు లకూ కథకులకూ ఎడమచేతినిండా వ్రాయడానికి పనిదొరికింది.

# చెంచురాణీ

౧

కర్నూలునుంచి శ్రీశైలము వెళ్ళేటప్పుడు తోవలో నాగలూటి అనేగ్రామమువద్ద యాత్రికులు మజిలీచేస్తారు. ఆ చిన్న గ్రామములో కాపుర మున్న వాళ్ళందరూ చెంచువాళ్ళే. దానికే యీమధ్య బైరాగికట్ట అనీ, మొండికట్ట అనీ పేర్లు వచ్చాయి.

నాగలూటిలో దేవాలయము ఉన్నది. దానికి ఎదురుగా నెగళ్లు వెలిగించి యాత్రికులు రాత్రులు గడుపుతారు. కొందరు దేవాలయమండపము మీద కెక్కి పడుకుంటారు.

నాగలూటి గ్రామము అడవులమధ్య ఉన్నది. మామిడి చెట్లూ, వెదురుదుబ్బులూ అక్కడ ఎక్కువగా పెరిగిఉన్నవి. మాఘమాసములో తాండ్రచెట్లు బాగా పుష్పిస్తవి. ఆపువ్వుల సౌరభము రాత్రివేళల నాగలూటి ప్రాంతాల వ్యాపిస్తుంది. అప్పుడే మామిడికాయలూ, చిలకకొట్టులూ రాలడం ఆరంభం. చెంచువాళ్ళు ఆ కాయలూ, పళ్ళూ తిని, పొట్ట నింపుకుంటారు.

వేసవికాలములో నాగలూటివద్ద మృగభయము కద్దు. రాత్రివేళ అప్పుడప్పుడు నీళ్ళు తాగడానికి ఒక్కొక్క పెద్దపులి ఆ ప్రాంతాలకు వస్తూవుంటుంది. అందు కోసరమే యాత్రికులు

నిద్ర మాని నెగళ్ళచుట్టూ కూర్చుంటారు.

నాగలూటి దగ్గిర చిన్న నీళ్ళకుండు (పుష్కరిణి)వున్నది. ఆ కుండులోకి ఎప్పుడూ పాతాళగంగ ధారగా వచ్చి పడుతూ ఉంటుంది. ఆ కుండులోనే యాత్రికులు స్నానముచేయడము. ఆ నీళ్ళే ఆ గ్రామస్తులు తాగడము. ఆ నీళ్ళ కోసమే పెద్ద పులులు రాత్రివేళల రావడము.

నల్లమల కొండలు అరణ్యమయము. అక్కడక్కడ చెంచుగూడెములు చాలాకలవు. నాగలూటి అటువంటి చెంచు గూడెమే. ఈ కొండలలోనే పుణ్యక్షేత్రములు కలవు. శ్రీశైల మన్నిటిలోను మహత్తుకలదని ప్రసిద్ధికెక్కినది. శ్రీశైలము మీది రాళ్ళన్నీ శివలింగములేనట. శ్రీశైలముమీది చెంచు లందరూ సిద్ధులేనట.

శ్రీశైలమును బట్టి నల్లమలకొండలకూ, అందలి అరణ్యములోని చెట్లకూకూడా మహత్తు కలిగింది.

ఒకయేడు శివరాత్రికి శ్రీశైలము వెళ్ళి తిరిగి వస్తూ కొందరు యాత్రికులు నాగలూటి సమీపాన వంటచేసుకొంటు న్నారట. వారికి ఆ నాటికి ఒకచెవులపిల్లి ఆహారము కాను న్నది. కుండలో దాని మాంసముంచి కూరవండుతూ కలియ బెట్టడానికి ఏమీ లేక కర్రముక్క పక్కను.పడివుంటే దానితో ఆ కూర కలియబెట్టేసరికి కుండలోనుంచి చెవులపిల్లి బుడుంగున బయటికి దుమికి పారిపోయిందట. సంజీవిని కున్న ప్రభావము నల్లమలకొండల మీది కొన్ని చెట్లకు కలదట.

చెట్లకే కాకుండా అక్కడ వాసముచేసే కొందరు సిద్ధులకుకూడా యిటువంటి మహత్తు కలదట.

# చెంచురాణీ

మనుష్యులకు ఆకలిలేకుండా వుంటే ఎంతబాగుంటుందో, ఏతాపత్రయమూ లేకుండా హాయిగా భగవన్నామస్మరణచేస్తూ కాలంగడపవచ్చునుగదా అనుకొనేవాడు ఒక బ్రాహ్మణు. అతడు అగుపించిన బైరాగుల నందరినీ ఆశ్రయించి ఆకలి లేకుండా చేసుకొందామని చాలాప్రయత్నించినాడు. ఒకమారు అతడు నల్లమలకొండలలో ఒక సిద్ధుడిని చూచాడు. ఆసిద్ధుడు ఏదో పసరు తాగించి ఆ బ్రాహ్మడికి ఆకలి లేకుండాచేశాడు. అప్పటికి సంతోషించినప్పటికీ ఆ బ్రాహ్మడు తరువాత పడ్డ ఆందోళన యింతా అంతాకాదు. భగవన్నామస్మరణ అటుం డగా తనకేదో జాడ్యము సంభవించినట్లు అతడు భావించి ఎన్నోమందులు మింగాడు. లాభములేకపోయింది. తుదకొక బైరాగి ఆతనికి తటస్థపడ్డాడు. ఆబైరాగి అతనికో మందిచ్చి నాడు. ఆ మందుప్రభావమువల్ల అతను పూర్వము తాను తిన్న పసరు కక్కివేసినాడు. ఆ బైరాగి ఆ పసరు తాను తిని క్షుధను జయించి అంతరాయరహితమైన సమాధిలో ప్రవేశిం చాడు. నల్లమలకొండల ప్రభావము అట్టిదని లోకులు చెప్పు కొంటారు.

నాగలూటిగూడెములో చాలా వెదురుగుడిసె లున్నవి. కాని ఒకగుడిసెమాత్రము దూరముగా ఒక మామిడిచెట్టు కింద పుష్కరిణికి సమీపముగా వున్నది. ఆ గుడిసెలో ఒక చెంచెతా, ఒక చెంచుబాలుడూ కాపురమున్నారు.

చెంచుది ముసిలిది. నల్లని శరీరము. వయస్సులో అంద కత్తె. ఇప్పుడు శరీరమంతా ముడతలు పడ్డది. చెంచుబాలుడు చామనచాయరంగు, నీలిరంగు కళ్ళు, రాగి వెంట్రుకలు.

